Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ సెప్టెంబరు నెల 12 వ తేది శుక్రవారం [నెం 26

## రెండేండ్ల యుద్ధగమనం.

### త్రివిధసైన్యము లొనర్చిన ఘనకార్యాలు.

రెండేండ్లయుద్ధం గడచినందున మిత్రమండలి నాయకులు వార్షిక దినసందర్భమున యింతవరకు జరిగిన కథ వర్ణించి, ముందు గెలుచుటకు చేసుకున్న స్థిరసంకల్పమును ప్రకటించుటకు అవకాశం కల్గింది. యుద్ధానంతరం దేశంలో యెట్టి యేర్పాటు ఉండాలో నిర్ణయించుటకు నియమింపబడిన బ్రిటిషు మంత్రి ఆర్థరు గ్రీనువుడుగారు యిట్లు చెప్పిరి :— "ఇదివరకువలెనే విజయం హిట్లరుకు అంతకంతకు దూరమగుచున్నది. గడచిన పండ్రెండుమాసాలలో అతడు క్రొత్త రాజ్యాలు కొన్ని జయించగల్గెను. కాని, జర్మనీ పడమర వైపు రష్యాతో క్రొత్తయుద్ధం ప్రారంభమయి, జర్మనీ యొక్క యువకసైన్యాలన్నింటిని మ్రింగివేయుచున్నది. ఆక్రమిత రాజ్యాలలో పాలకుల క్రూరత్వం అధికమై, వారిపై దేశీయుల ద్వేషం ప్రబలి, కుట్రలు, కర్మాగారాలలో పనులను పడగొట్టుట ఎక్కువైంది. అసలే అలసియున్న జర్మను సైనికాధికారులకు అనేక చిక్కులు కల్గుచున్నవి. గతయేడు హిట్లరుకు ఐదు ఆశాభంగాలు జరిగినవి. మన యుద్ధప్రయత్నానికి ఎక్కువ తోడ్పడకుండా అమెరికాను ఆటంకపరచలేకపోయెను; ఇరాకు సిరియా, పెర్షియాలందు మన బలం నిర్మూలించడానికి తిరుగుబాటులు ప్రోత్సహించి విఫలుడయ్యెను; మనకు స్నేహంగానున్న రషియాను అతివడిగా పడగొట్టాలని ప్రయత్నించి అట్లుచేయలేకపోయెను. నేడు మూడోయేడు కష్టాలు ప్రారంభమవుతున్నాయి. అందుచే జర్మను ప్రజలు నివ్వెరపోతున్నారు. హిట్లరు సంగతి యిట్లుండగా బ్రిటను సంగతి ఎట్లుందో చూడండి. యుద్ధం ప్రారంభమయినప్పటినుండి ఎప్పుడూలేనంత ఆయుధబలం యిపుడు చేకూరింది. విమానబలమునందు జర్మనీతో సరిసమానమగుటే కాక దానిని మించిపోతున్నది. రూజువెల్టు-చర్చిలుగార్ల అట్లాంటికు ప్రకటనయందు తెల్పిన ఎనిమిది ఆదర్శముల వలన హిట్లరుయొక్క నూతనవ్యవస్థగూర్చిన రాజకీయ ప్రచారమంతా చిత్తయిపోయింది.

యుద్ధంలో మూడో ఏడు ప్రారంభమగుసరికి మనశక్తి వారవారానికి హెచ్చుతూ, నాజీ దౌష్ట్యాన్ని రూపుమాపగల నమ్మకం హెచ్చుతున్నది. హిట్లరు శక్తియు, సప్లైలు తగ్గిపోవుచున్నవి. మనం యింకా యుద్ధంలో గెలువలేదు. ఇంకా ఎక్కువ కష్టాలు ముందున్నాయి. కాని ఒకటి మాత్రం నిజం—హిట్లరుతత్వం పూర్తిగ నాశనమయి, నాజీ దౌష్ట్యం రూపుమాస్తేగాని యీ యుద్ధం ముగియదు."

### నౌకాదళం.

బ్రిటిషు నాయకులును మిత్రమండలి నాయకులును, సేనాధిపతులందరును యీరీతిగానే ధైర్యోత్సాహములతో పలికిరి. నౌకాదళాధికారియగు అలగ్జాండరు అడ్మిరాలిటీ ప్రథమ ప్రభువు యిట్లనెను : "స్వాతంత్ర్య సమరమును పూర్తిగ గెల్చుటకు బ్రిటిషు నౌకాదళం ఎక్కువ తోడ్పడగలదనీ, సముద్రాధిపత్యము దానికే గలదనీ రుజువుచేయుటకు టోరెంటో, మటపం రేవులవద్ద జరిగిన నౌకా యుద్ధములును, గ్రీసు క్రీటులను నేర్పుగ ఖాళీచేయుటయు, జర్మను యుద్ధనౌక బిస్మార్కును ముంచుటయు, అట్లాంటికు సముద్రమునందు జర్మను జలాంతర్గాములను ఎక్కువగ చెండాడుటయు నిదర్శనములు." బ్రిటిషు నౌకాదళముల ఘనకార్యములగూర్చి రాయిటరు నౌకా విలేఖరి యిట్లు వర్ణించెను: "రెండోయేడు యుద్ధంలో నౌకాదళం ఘనకార్యములలో చెప్పుకోదగ్గవి చాలగలవు. బిస్మార్కును ముంచుట చరిత్రాంశముగ శాశ్వతంగా జ్ఞాపకముండగలదు; అచ్చటచ్చట చెదరియున్న యుద్ధనౌకలు ఎంతవడిగా చేరుకొని ఒండొరులతోడ్పాటు పొందగలవో, క్రూయిజరులు పట్టుదలతో శత్రునౌకలను ఎంత నేర్పుగా వెంటాడగలవో రుజువయ్యెను. మార్చి 28 వ తేదీన మటపం రేవు చేరువ యుద్ధం, టోరంటో యందున్న ఇటలీ నౌకాశ్రేణిపై బ్రిటిషు నౌకావిమానాలు దాడిజరిపి విజయమొందుట, మార్చి 4 వ తేదీన లొఫెటను దీవులపై దాడియు చెప్పుకోదగ్గ యితర విషయములు. గ్రీసు క్రీటులనుండి బ్రిటిషు సేనలను తప్పించుచున్నపుడు ఎక్కువ వైశాల్యంలేని చిన్న సముద్రములలో బ్రిటిషు నౌకాదళం చాల నేర్పుచూపెను. —ఉత్సాహకరంగా ఉండే యీ యుద్ధాలలో పాల్గొనుటేకాక దూరదేశాలకు వర్తక నౌకలకు కాపలాపోవుట, శత్రునౌకా మార్గములను కాచి శత్రుసంహారంచేయుట, నౌకాదళ సైనికులకు సప్లైలు అందజేయుట యివన్నిగూడా నౌకాదళంవారు చేసే ఘన కార్యాలకు చెందినవే. నౌకాదళం కార్యాలలో నూటికి పదివంతు మంచియుద్ధాలును, 90 వంతు నిరుత్సాహంగానుండే కాపలాపనియని వర్ణించబడెను. గడచిన అట్లాంటికు సముద్రమునందు జరుగుచున్న యీ నౌకాయానం కాపలాపనినే అట్లాంటికు యుద్ధమంటారు. ఈ యుద్ధంలో బ్రిటిషు విమానదళానికి ఇండియా|నౌకాదళానికి అధినివేశనౌకాదళానికి చెందిన నౌకలుగూడ తోడ్పడినవి. బిస్మార్కును ముందుగ 'పిరూను' అను పోలిషు యుద్ధనౌక చూచెను. డచ్చి తూర్పుదీవుల ప్రాంతములందు డచి నౌకాదళం నావలే ఎక్కువపనిచేస్తున్నాయి. ఇంతవరకు శత్రువుల నౌకలు మొత్తం 4,700,000 టన్నుల బరువుగలవిముంచివేయబడుటో, పట్టువడుటో వాటంతనవి థిథిలేక మునుగుటో జరిగెను. బ్రిటిషువారివి మిత్రమండలివి జూన్ ఆఖరు సరికి మొత్తం నౌకలు 1,738 (7,118,122 టన్నుల బరువు) ముంచబడినవి.

### సైన్యం.

డన్కర్కు రేవునుండి బ్రిటిషు సైనికదళమును మరలించినప్పటినుంచి పెరిగిన బ్రిటిషు సైన్యం సామ్రాజ్య సైన్యములును మధ్యప్రాచ్య యుద్ధరంగమునందు, యితర యుద్ధరంగములందు పొందిన విజయములుగూడ యింతకన్న ఎక్కువ ధైర్యమును కల్గించుచుండును. హిట్లరు యింకనూ బ్రిటనుపై దాడిచేయుటకు యత్నించినచో అతని సైన్యాలను తిరుగగొట్టుటకు బ్రిటిషు సైన్యములు సిద్ధంగ ఉన్నాయి. అంతేకాదు, యూరోపు ఖండంమీదకు దాడివెడలి జర్మనుల ఆశ

లన్నీ అడుగంటించుటకుగూడ ఇంగ్లాండులో నౌక సైన్యం సిద్ధమవుతున్నది. మధ్యప్రాచ్యమునందలి పరిస్థితులు యిది వరకుకన్న చాల అనుకూలంగా మారినవి. దక్షిణాఫ్రికా తూర్పు ఆఫ్రికాలపై ఇటలీ నేల సైన్యములను నౌకాదళములను కుంపి బెదరించే అవకాశం తొలగిపోయింది. ఇపుడు ఎఱ్ర సముద్రమునందు బ్రిటిషు నౌకలు నిర్భయంగా ప్రయాణం చేయగలవు. తరుచు దెబ్బతింటున్న గోండారుపురము, మరికొన్ని చిన్న శిబిరాలు మాత్రం వానలధికంగానుండుటచే దారిలేక మన సైన్యాలకు చిక్కకుండా వుండిపోయినాయి. ముసోలినిగారి 2,50,000 సైన్యంలోను మిగిలియున్న దింతే. జిబుటిలోమాత్రం కొద్దిమంది విషీ ఫ్రెంచివారు దాగియున్నారు. వారుకూడ త్వరలో తరిమి వేయబడుదురు. తూర్పున సిరియాలో బ్రిటిషువారి చర్యవలన అక్షరాజ్యాలకు తూర్పుద్వారం మూసివేయబడి, మిత్రమండలి శక్తి ఎక్కువచేయబడెను. ఇరానులో మన సైన్యం ప్రవేశించుటవలన మధ్య ప్రాచ్యాదేశములకును, ఇండియా సైన్యమునకు రష్యాతో ప్రత్యక్ష సంపర్కము, రాదారీ యేర్పడింది.

### విమాన దళం.

యుద్ధంలోకల్లా యెక్కువ ప్రశంసనీయమగు కార్యం రాయలు విమాన దళంవారును, సామ్రాజ్య వైమానికులును చేసిరి. వారు బ్రిటనుపై జర్మనీ జరిపిన యుద్ధమున గెలుచుటే కాక, జర్మనీపరిశ్రమల కేంద్రములన్నింటికిని యుద్ధం వ్యాపింపజేసి, రాత్రింపవళ్లు వారి పరిశ్రమలను, సైనిక కేంద్రములను నేలమట్టం చేస్తున్నారు. “జర్మనులు యితరులచే జయింపబడజాలరను నమ్మకం నిరుడంతా వ్యాపించియుండెను. అది యిపుడబద్ధమయింది.” అని విమానశాఖా మంత్రి సర్ ఆర్చిబాల్డు సింక్లగుగారు చెప్పిరి.

ఈ రెండేండ్ల యుద్ధంలో 4,500 జర్మను విమానాలను బ్రిటిషు విమానాలు పడగొట్టినవనుకొనుచున్నారు. బ్రిటిషువారి ఫైటరు విమానాలు 1,400 కూలినవి. కాని 450 మంది వైమానికులు రక్షింపబడిరి. ఇంగ్లాండు-జర్మనీల విమాన పోటీలయందు ఇంగ్లాండు విమానదళం చాలముందుకుపోయెను. ఇందుకు మూడు కారణాలు గలవు. జర్మనీ విమాన యుత్పత్తి కేంద్రాలపై 18 నెలలనుండి విరామంలేకుండా బ్రిటిషు విమానాలు బాంబులు వేయుటచే, యుద్ధానికి పూర్వం విమాన బలమునందు రాక్షసశక్తిగల్గిన జర్మనీ యిపుడా శక్తినిగోల్పోయింది. రెండవది రష్యాతో యుద్ధంచేసి గెలిచి, దీర్ఘ యుద్ధం వల్ల గోల్పోయిన శక్తిసంపదలను తిరిగి పొందాలని జర్మనీ ఆశపడింది. కాని ఆ యుద్ధంలో దెబ్బతింటున్నది. మూడవది, ఇంగ్లాండు విమానయుత్పత్తి దిగుమతులు చాల హెచ్చినవి. అమెరికా, రష్యాల సహాయంవలన బ్రిటిషు విమానశక్తి, యీ మూడోయేట జర్మనీ శక్తిని మించిపోవచ్చును. ఇప్పటికింకా విమానాల సంఖ్యలో జర్మను లఫ్టివాఫ్‌తో రాయలు విమాన దళం సరికాలేదు. కాని యూరోపులో యింకో విమాన రాక్షసశక్తి పెరుగుచున్నది. లఫ్టివాఫ్ (జర్మను విమాన దళం) సగం రష్యా రంగంలోను, మిగిలిన సగం మధ్యధరా సముద్రములోను చెదరియున్నది. బ్రిటిషు దళానికి ఆ చిక్కు లేదు.

బ్రిటనుపై విమానయుద్ధమునందు రాయలు విమానదళముల రక్షణశక్తి విదితమయ్యెను. మొదటి యేడు యీ యుద్ధంలో జర్మను విమానాలు 2,375 పడినవి; బ్రిటిషు వైమానికులు 375 గురు చనిపోయిరి. రెండో ఏడు జర్మనీపై యిపుడు బ్రిటిషు విమానాలు జరుపుచున్న అహోరాత్రుల యుద్ధమునందు నష్టాలు ఎక్కువగ నున్నవి. ఈ యేడు జూలై, ఆగస్టు మాసాలందు యూరోపుమీదికి దాడి పోయిన బ్రిటిషు విమానాలు 5 పోతే, వాటి నెదిరించిన జర్మను విమానాలు 4 చొప్పున పోయినవి. నిరుడు జూలై, ఆగస్టులో బ్రిటిషువారివి 1 పోతే జర్మనువారివి 4 చొప్పున పోయినవి. 1941 లో బ్రిటిషువారివి 513, జర్మనీవి 420; 1940 లో బ్రిటిషువారివి 347 పోతే జర్మనీవి 1,338 విమానాలు కూలిపోయినవి. ఈ ప్రపంచంలోకల్లా అతి వడిగా గంటకు 400 మైళ్లు పోగల స్పిటుఫైరు విమానాలు, నాల్గు పెద్ద ఫిరంగులు, 6 మర ఫిరంగులు కల్గి 35,000 అడుగుల ఎత్తువరకు పోగల బ్రిస్టలు బ్యూఫైటరు విమానాలు బ్రిటిషువారికి యిపుడు గలవు. అందుచే నేర్పునందును, దెబ్బ కొట్టే శక్తియందును రాయలు విమానాలే లఫ్టువాఫ్‌కన్న మిన్నగ వున్నాయి. విమానాల వడి నూటికి 10 వంతున ఎగిరే ఎత్తు 40 వంతున, మోసే బరువు 100 వంతున యీ రెండేండ్లలో వృద్ధిపొందింది. జర్మనీ యొక్క తూర్పున ఘోర యుద్ధం జరుగుతూవున్నపుడు పడమరనుగూడ పని కల్పించాలనే రాయలు విమానదళం వారి ముఖ్యోద్దేశము. రాత్రి బాంబులు వేయడం ఎక్కువ చేస్తారు. 1940 లో బ్రిటిషు ఆకాశంలోనికి శత్రు విమానాలు రాకుండా కాపాడినట్లే యిపుడు ఫ్రాంసు ఆకాశంనుండి జర్మను విమానాలను తుడిచివేయాలని బ్రిటిషు ఫైటరు విమానదళంవారు తలంచిరి. ఈ రెండేండ్లలో బ్రిటిషుతీరపు విమానదళంవారి విమానాలు ఎంత తుపానురోజునైనా ఎగురకుండా వున్న గోజులేదు. మొత్తం 400 లక్షల మైళ్లు ఎగిరినవి. ఈరీతిగా బ్రిటిషు విమానశక్తి హెచ్చుతూవుంటే విమాన పోటీయందు రాయలు విమానాలదే పైచేయి అగునని జర్మనులు భయపడుటలో ఆశ్చర్యంలేదు. అందుకే చర్చిలుగారు రాయలు విమానదళాన్ని పొగుడుతు “మానవ యుద్ధ చరిత్రలో యింత విశేష జనబాహుళ్యం యింత కొద్దిమందికి ఋణపడియుండుట కనీ వినీయెరుంగము.” అని చెప్పిరి.

# చర్చిల్ ప్రధాని ఉపన్యాసం.

**అట్లాంటికు యుద్ధమున బ్రిటిషువారిదే పైచేయి—ఇండియా భవిష్యత్తును గూర్చి సూచనలు—రష్యాకు ఎక్కువ సహాయము.**

బ్రిటిషు ప్రధాని విన్‌స్టను చర్చిలుగారు రూజువెల్టు అధ్యక్షుని అట్లాంటికు సముద్రమునందు కలిసికొని మాట్లాడిన పిమ్మట బ్రిటిషు పార్లమెంటులో ప్రథమ ఉపన్యాసమును యీ మంగళవారము నాడొసంగిరి. అందు ఇండియా భవిష్యత్తునిగురించి సూచించుచు తానూ రూజువెల్టు గావించిన ప్రకటన ఇండియాకు వర్తించదనియు, అది జర్మనీ ఆక్రమించిన యూరోపుదేశాల పునరుద్ధరణకే వర్తించుననియు చెప్పిరి. నిరిటియుద్ధం ఫలితంగా బ్రిటిషువారికి చేకూరిన లాభాలను పేర్కొనిరి.

రూజువెల్టుగారితో అట్లాంటికు సమావేశమునందు యీ దిగువ నాల్గు ముఖ్యవిషయములు నిశ్చయించుకొంటిమని చర్చిలుగారు దెలిపిరి :—

1. ప్రస్తుతం తమను ఎదుర్కొన్న ప్రమాదమునందు బ్రిటిషు-అమెరికా ప్రభుత్వములు ఎట్లు ప్రవర్తించు కోవలెనో తెలుపునట్లు ఎనిమిది ముఖ్య సూత్రములు నిర్ణయించుట.

2. హిట్లరు ప్రారంభించిన దారుణ దాడినుండి రష్యాను తప్పించుటకు సహాయం చేయువిధము.

3. దూరప్రాచ్యమునందు జపాను ఇంగ్లాండు రష్యాల భద్రతకు భంగంగా చేయు చర్యల నరికట్టి, పసిఫికు మహా సముద్రమునకు యుద్ధం ప్రాకకుండా చేయుట.

4. రెండుదేశాల సైనిక నావిక విమాన దళాధికారులు కలసి ఆలోచించవలసిన సైనిక విషయము లెన్నోయుంటే వాటన్నింటి గూర్చి సదరు ఉద్యోగులు కలసి చర్చించుకొనుట జరిగెను.

యుద్ధానంతరం ప్రపంచవ్యవస్థ ఎట్లుండవలెనో తెల్పుచు అమెరికా ఇంగ్లాండులు నిర్ణయించిన 8 సూత్రములు ప్రకటింపబడినవి. అవి బ్రిటను విజయంపొందగానే అమలు జరుపబడును. ఈ సూత్రములు రెండు దేశాలుకలసి నిర్ణయించినవి కనుక ఉభయులు కలసి వాటినిగూర్చి చెప్పిన అర్థ నిర్ణయమే శిరసావహింపవలసినది. ఈ సూత్రములు ఏదేశానికి ఎట్లు వర్తింప జేయవలెను అన్నది యిపుడు నిర్ణయింప వీలులేదు. సూత్రములు మాత్రము యిపుడు నిర్ణయింపబడినవి. అమలు జరుపువిధం యుద్ధానంతరం బయలు దేరు వివిధ సమస్యలనుబట్టి నిర్ణయించబడును. అని చర్చిలు గారు తెలిపిరి.

## ఇండియాకు వర్తింపవు.

అట్లాంటికు ప్రకటనయందు తెలుపబడిన, పైన పేర్కొనిన 8 స్వాతంత్ర్య సూత్రములు ఇండియా-బర్మాలకు వర్తింపవని తెల్పుచు చర్చిలు ప్రధాని యిటులు నుడివెను:— ఇండియా-బర్మాలలోను బ్రిటిషు సామ్రాజ్యములోని యితర దేశములలోను ఆ దేశీయుల రాజకీయాధికారం ఏ రీతిగా అభివృద్ధి చెందవలెనో బ్రిటిషు ప్రభుత్వంవారు స్పష్టీకరించుచు యిదివరకే ప్రకటనలు చేసియుండిరి. అవియే ఆ దేశములకు వర్తించును. కాని అట్లాంటికు సమావేశమునందు నిర్ణయమైన సూత్రములు వర్తించవు. భారతదేశపు రాజకీయ హోదాను గురించి 1940 వ సం॥ అగస్టు మాసంలో ఇండియామంత్రి అమెరీగారు యిట్లు ప్రకటించియుండిరి. 'బ్రిటనుకును, బ్రిటిషుసామ్రాజ్యంలో చేరియున్న యితరదేశములకును గల హోదాయే సామ్రాజ్యమునందు చేరియుండు ఇండియాదేశం పొందునట్లు బ్రిటిషు ప్రభుత్వం తోడ్పడును. కాని ఇండియాతో చాలకాలమునుండి సంబంధముండుట వల్ల ఇండియాలోగల వివిధసంఘములు మతములు జాతుల వారి యెడలను నిర్వర్తింప వలసిన బాధ్యతలు కొన్ని ఇంగ్లాండునకు గలవు. వాటికి లోబడియే రాజ్యాంగవిధానము నిర్ణయింప బడును. బర్మాలోగూడ స్వపరిపాలన స్థాపించుటకు కొన్ని పద్ధతులు అపుడే అమలునందున్నవి.

"అట్లాంటికు సమావేశమునందు మేము ముఖ్యంగా ప్రస్తుతం నాజీపాలనక్రింద నలిగిపోవుచున్న యూరోపు రాజ్యములు జాతుల స్వాతంత్ర్యము సౌఖ్యము తిరిగి ప్రసాదించుట గూర్చియు అవసరమయితే సరిహద్దు మార్పులు చేయవలసి వచ్చినచో ఎట్టి సూత్రములు అనుసరింపవలసియుండునాయనియు ఆలోచించియుంటిమి. బ్రిటిషు పరిపాలన క్రింద స్వపరిపాలన హోదాను క్రమేణ బడయుచున్న దేశముల సమస్యకు వీనికి సంబంధంలేదు. వీటి విషయమున మేము యిదివరకే స్పష్టమగు ప్రకటనలు చేసియుంటిమి. ఆ ప్రకటనలు గూడ అట్లాంటికు సమిష్టి ప్రకటనయం దుద్దేశించిన స్వాతంత్ర్యం సౌఖ్యంగూర్చిన సూత్రములకు అనుగుణ్యముగనే యున్నవి" అని చర్చిలుగారు తెలిపిరి.

## నిరిటికన్న యీ యేడు మేలు.

తరువాత నిరుడు జరిగిన యుద్ధం ఫలితములను పేర్కొనుచు, శత్రువు ఇంగ్లాండునకు దిగ్బంధం చేయాలని అనేక విధముల ప్రయత్నించి విఫలుడై చేరువ సముద్రాలనుండి తరిమివేయబడి అట్లాంటికు అవతలి వొడ్డునకు పోయెననెను. అట్లాంటికు సముద్రమున శత్రు నిరోధమును దాటి అనేక నౌకలలో సరకు బ్రిటిషు తీరమునకు చేరెననియు, జూలై, అగస్టు మాసములయందు మిత్రమండలి నౌకల నష్టం చాల తగ్గెననియు, మనమునిగ్గిన నౌకలకు మూడింతలు జర్మనీ ఇటలీ నౌకలను ముంచగల్గితిమనియు, వారి నౌకా బలంకన్న మన బలం పది లేక ఇరువది రెట్లధికమయినందున, వారికి కలిగిన నష్టం చాల యెక్కువనియు చెప్పిరి. 1941 వ సంవత్సరములో శత్రు నౌకలు నెలకు 15 చొప్పున మన టార్పెడోలచే ముంచబడెను. జూలై అగస్టు మాసములలో మన నష్టం తక్కువైనంతమాత్రమున మన ప్రమాదం తొలగిపోయిందని ఎంచరాదనియు, శత్రువు యెక్కువ సబుమరైనులను, విమానాలనుఉపయోగిస్తున్నాడనియు చర్చిలుగారు హెచ్చరించిరి. జర్మనులు క్రొత్తరకం శబ్దం చేయువందు గనుల నుపయోగిస్తున్నను వాటికి విరుగుడు బ్రిటిషు శాస్త్రజ్ఞులు కనిపెట్టినందున అవినిరుపయోగమయినవనిరి. తమ ఆయుధ సంపత్తి హెచ్చుచున్నదనియు, నౌకాదళం విమానదళముల అన్యోన్య సహకారం వృద్ధియగుచున్నదనియు, అట్లాంటికు మహాసముద్రమున మధ్య అంచగాయున్న ఐసులాండు దీవిని జర్మనులాక్రమించుకోకుండా నుండుగనే అమెరికా బ్రిటిషు సైన్యములాక్రమించినవనియు తెలిపిరి. అచట విశాలమగు విమానాశ్రయములను కట్టుచున్నారు. అవి సముద్రమార్గములను భద్రముగా కాపాడగలవు. ఆర్కుటికు సముద్రమున స్పిట్జు బెర్గనునుండి ఆఫ్రికాలో టోబ్రూకువరకు అర్ధచంద్రాకారంగా మిత్రమండలి యుద్ధరంగం వ్యాపించియున్నది. సామ్రాజ్యసైన్యములు దానిని కాపాడుచున్నవి. గడచిన ఏడాదిలో మన సైన్యం 750,000 వరకు వృద్ధిపొంది తగిన ఆయుధ సంపత్తి కలిగియున్నది. విమానదళం యుద్ధ ప్రారంభంలో ఎంతయుండెనో అంత తిరిగి తయారయినది, ఇంకను వృద్ధి పొందుచున్నది. ఇటలీ సామ్రాజ్యమునంతా తీసుకుంటిమి. ఈజిప్టును ఇటలీనుండి రక్షించితిమి. సిరియాను ఆక్రమించి సైప్రసునకు భద్రత చేకూర్చితిమి. చివరకు పర్షియాలో సత్వరచర్యవలన రష్యాకు సహాయం చేయుటకు పర్షియనుగల్ఫు ఇరానులద్వారా రాదారి ఏర్పరచుకొంటిమి. ముందెట్లున్నా యీ విజయములు చరిత్రలో ప్రశంసార్హములుగ నుండగలవని చర్చిలుగారనిరి.

## సిరియా.

బ్రిటిషు సేనలు సిరియాను ఆక్రమించవలసిన అవసరం గూర్చి తెల్పుచు అచటనున్న ఫ్రెంచి గవర్నరు-జనరలు డెంట్సుగారు జర్మనులపక్షమై దేశద్రోహం చేయుచుండగ బ్రిటిషువారు అనేక చిక్కులలోనున్నను గ్రీసులోను సిరనైకాయందు ఓటమి సంభవించినను, స్వతంత్ర ఫ్రెంచి సేనల సహాయమున సిరియాను ఆక్రమించవలసి వచ్చెననియు, అందువలన బ్రిటిషువారిదగు సైప్రసు దీవికి భద్రత ఏర్పడి మిత్రునిగానున్న టర్కీతో ప్రత్యక్ష సంపర్కమేర్పడి చమురు గనులు తమ వశమైనవని చర్చిలుగారు తెలిపిరి. సిరియాలో రాజ్యకాంక్ష తమకేమి లేదనియు, సిరియా ప్రజలకు యుద్ధం ముగిసేవరకు వేచియుండవలసిన అవసరంలేకుండా స్వాతంత్ర్యయు వీలైనంత త్వరలో ఒసంగబడుననియు తెలిపిరి. సిరియాలోని ఫ్రెంచివారిని తరిమి వేయుటకుగాని, అచటి ఫ్రెంచి ప్రభుత్వమును తొలగించి స్వతంత్ర ఫ్రెంచి ప్రభుత్వమును స్థాపించుటకుగాని అచటికి తాము పోలేదనియు, సిరియా ప్రజలయెడ తమ బాధ్యత నిర్వహించుటకే పోయియుంటిమనియు స్పష్టంగా తెలిపిరి.

## క్రొత్త స్నేహం: రష్యాకు సహాయం.

తరువాత రష్యాపై యుద్ధంగూర్చి తెల్పుచు, రష్యనులు బాగుగ నిలువరించుకొని జర్మను దాడి నెదుర్కొనగల్గిరనియు గత యుద్ధంలో ఒక్క యేడాదిలోను గోల్పోయినంతకన్న చాల ఎక్కువ జర్మను రక్తము యీ మూడు నెలలలో యుద్ధరంగమున ప్రవహించెననియు తెలిపిరి. రష్యను యోధుల తీవ్ర నిరోధమేగాక చలి బాధనుగూడ జర్మను సేన

లు ఎదుర్కొనవలసి యుండును. యుద్ధరంగం కడు విశాలమైనదగుటచే సైన్యాలకు సప్లై లందుటగూడ కష్టం. రషియాపై జర్మను యుద్ధం ప్రారంభించినప్పటినుండి శక్తివంచన లేక సహాయం చేయాలని నిశ్చయించియుంటిమి. రూజువెల్టుగారుకూడ స్టాలిను నియంతకు ఆరీతి సందేశమంపెను. రషియాకు కోటి కోటిన్నర సైన్యంగలదు. వారందరికీ ఆయుధములు, ఆహార పదార్థములు యితర సరకు సప్లై అగుట కష్టమే. కావున క్రొత్తగా స్నేహమైన రష్యాకు ఎంత సహాయమైనా చేయవలసియుంది. పైగా రషియాలోని మందుగుండు, ఇనుము, ఉక్కు యుత్పత్తి కేంద్రాలు చాల శత్రువులవశమైనవి. రషియాయొక్క గొప్ప సేనకు ఆయుధాల కొరత లేకుండ చేయుటే ఆంగ్లో-రష్యను అమెరికను రాయబారుల సభయొక్క ముఖ్య కర్తవ్యమైయున్నది. ఈ విషయమున అశ్రద్ధ చేయలేదు. అమెరికానుండి రాయబారవర్గం రాగానే బ్రిటిషు రాయబారవర్గం కూడ బయలుదేరి వెళ్లి కార్యవిధానం నిర్ణయించును. ఈ లోగానే అత్యవసరమగు నిర్ణయములు గావించిరి. అపుడే చాల సరకు రషియాకు పంపబడుచున్నది. మన దేశంలో ఉత్పత్తి చాల ఎక్కువగుచున్నది. మనకొరకు అమెరికాలో జరుగు ఉత్పత్తికై ఎన్నో క్రొత్త ఫ్యాక్టరీలు కట్టి పరిశ్రమల పరిస్థితులు మార్చవలసియుండును. మన మనుకున్నంత సహాయం అమెరికానుండి రాకపోవచ్చును. రషియాకు సరకు పంపుటకు స్టీమరులు చాలకపోవచ్చును. మార్గాల నిరోధముండవచ్చును. ఆర్కిటిక్ సముద్రమార్గంలో మంచు గడ్డ కట్టియుండును. పసిఫిక్ రేవు వ్లాడివాస్టాకువద్ద జపాను కాచియున్నది. ఇక పర్షియను గల్ఫునుండి ఇరాను (పర్షియా) ద్వారా రషియాలోనికి సరకు రవాణా చేయవలసియుండును.

### ఇరాను ఆక్రమణ.

ఇరానులో జర్మను గూఢచారుల కుట్రలు సాగనీయకుండ సకాలమున రషియను సేనలు బ్రిటిషు సేనలు ప్రవేశించి దేశాన్ని ఆక్రమించుట రషియాకు దగ్గరి దారి భద్రపరచుకొనుటకే. ఇరానులో రైలుమార్గము యిటీవలనే పూర్తియైనది. దానికితగిన రైలు బండ్లు ఇంజనులు పంపి రషియాకు సరకు రవాణా ఎక్కువ చేయబడును. ఇరాను ఆక్రమణవలన రషియా దక్షిణ సైన్యముతోను విమానబలంతోను బ్రిటిషు సేనలు చేతులుకలిపి సమిష్టిగా శత్రువు నెదుర్కొనుటకు వీలగును. ఇరాను ఆక్రమణవలన జర్మనుల తూర్పు దాడి అరికట్టబడును. ఇండియా సేనలు ప్రశంసార్హముగ పని చేసినవి. వీరి చర్యవలన భారతీయులకు యుద్ధం వేయిమైళ్ల దూరంలో ఉంచబడింది అని చర్చిలుగారు చెప్పిరి.

“ముందేమి జరుగునో చెప్పలేము కాని యింతవరకు మనము చేయగల్గిన పని ముందు తరములవారి గౌరవమును పొగడ్తను బడయగలదు. ఒక సంవత్సరం క్రింద మనస్థితి చాల అసంతృప్తికరంగానున్నట్లు, చాల దుర్భరముగానున్నట్లు మనకు తప్ప తక్కినవారందరికీ కన్పట్టెను. ఇపుడు చాల సంతృప్తికరముగనున్నది. మనభావి కల్యాణము మన చేతులలోనే యున్నదనిన్ని మనకు సంపూర్ణమైన ఆత్మ స్వాతంత్ర్యం కలదనిన్ని ఆశ్చర్య చకితమై యున్న ప్రపంచమునకు మనము ఎలుగెత్తి చాటగల్గుచున్నాము” అని చెప్పి చర్చిలుగారు ముగించిరి.

# బ్రిటిషువారి షరతులు ఇరాను ప్రభుత్వ మంగీకరించుట.

బ్రిటిషు, రష్యా సేనలు తాత్కాలికముగ ఇరాను దేశమును ఆక్రమించిన పిమ్మట, ఇరాను ప్రభుత్వమునకు పంపిన షరతుల నంగీకరించుచు జవాబు వచ్చుట ఆలస్యమయినది. అందుచే కొంత ఆందోళనగానుండెను. ఇరాను ముఖ్య పట్నమగు టెహరానులోనున్న బ్రిటిషు, రష్యా ప్రతినిధులు ఆ దేశంలోనున్న జర్మనీ, ఇటలీ ప్రజలందరిని తరిమివేయుటో, నిర్బంధించుటో చేయాలని కోరిరి. జర్మను ప్రభుత్వ రాయబారవర్గంకూడా మూసివేయాలని కోరిరి. ఇరాను పార్లమెంటులో 9 వ తేది మంగళవారంనాడు ఇరాను ప్రధానమంత్రి యీ షరతులన్ని అంగీకరించినట్లు ప్రకటించెను. కొన్ని పురముల ఆక్రమణగూర్చి మాత్రం యింకా ఆలోచనలో ఉన్నదనెను. టెహరానునందున్న జర్మనీ, ఇటలీ, హంగేరి రుమేనియా ప్రభుత్వప్రతినిధి కార్యాలయములు మూసివేయుట కంగీకరించెను. జర్మను ప్రజలందరు బ్రిటిషు రష్యను సేనలకు ఒప్పగించబడుదురు. ఉర్మియా సరస్సు దక్షిణమునుండి కెస్వను మీదుగ తూర్పు ఉత్తరములకు గీయబడిన ఒకగీటు దక్షిణమువరకు ఇరాను సేనలు వెడలిపోవును. ఇరాను సేనకు ఆయుధాలు యంత్రబలం ఉంచబడును.

కాస్పియను సముద్రం పర్షియను గల్ఫులకు మధ్యగానున్న సుల్తానాబాదు నగరమును, అచటి చమురుగనులను భారతీయసేనలు వశపరచుకొన్నవి. ఉత్తర పడమరలందు ముఖ్యనగరములనుగూడ మిత్రమండలి సేనలు వశపరచుకొన్నవి. రాజధాని నగరమగు టెహరానులో బ్రిటిషు రష్యను సేనలులేవు.

రష్యాసేనలు రెషీదు నగరమును, టెహరానునుండి అక్కడవరకున్న ట్రంకురోడ్డుపై పురములను ఆక్రమించి కాస్పియను సముద్రమునుండి పడమరకు జ్వానువరకుగల ప్రాంతమునాక్రమించుటచే, జర్మనులు తప్పించుకొని పోవుటకిక మార్గంలేదు. కుజ్వినువద్దనే రష్యను సేనలు దక్షిణమునుండివచ్చిన బ్రిటిషు సేనలను కలసినవి.

సిరియా, ఇరాకు, ఇరానులు, ఇండియాను మధ్యధరా సముద్రంతో కల్పుచున్నవి. ఈ ప్రాంతమును జర్మనులు ఆక్రమించినచో తూర్పున ఇండియాపైని ఉత్తరాన రష్యాపైని, దక్షిణమున సూయజు కాల్వ, ఈజిప్టులపైని దాడి చేయుటకు సులభమయియుండును. అంతేకాక ప్రపంచంలోకెల్ల ముఖ్యమగు చమురు గనులు వారివశమయ్యెడివి. అందుచే ఇరాన్ను మిత్రమండలి సేనలుముందుగ ఆక్రమించుటవలన మధ్యధరా సముద్రమునకు ఇండియాకు గొప్ప ముప్పు తప్పిపోవుటేగాక, ఇరాను ప్రజలకే ఎంతో శ్రేయస్కరము. ఇదివరకువలె తిండిలేక మాడనవసరం లేకుండా, వారి ఆర్థిక రాజకీయ జాతీయ సౌఖ్యమంతకు హామీయొసంగబడెను. ఇరాను ఆక్రమణ రష్యా సహాయమునకు ఎంత అవసరమో చర్చిలుగారు ఉపన్యాసములో చెప్పియున్నారు. హిట్లరు ఆక్రమించదలచిన దేశాలన్నింటిలో విమానాశ్రయములను ముందుగ తన గూఢచారులు వశపరచుకొన్నట్లు చేయును. హాలెండు, సిరియాలలో అట్లే చేసెను. ఇరానులోని విమానాల కనువగు మయిదానాలు క్వాషు, ఇరానుషారు లందున్నవి. అవి ఇండియాలోని బెలూచిస్తానమునకు, 45, 135 మైళ్ల చేరువలోనున్నవి. బెలూచి, సరిహద్దు, సింధురాష్ట్రాలు, కతియవారు, రాజపుటానా, పంజాబు, డిల్లీ, బొంబాయి, పూనా, సతారాలు, యివన్నీ ఇరాను విమానాశ్రయములకు 1,000 మైళ్లలోపేయుండుటచే, బాంబులు పడవీలగానున్నవి. అందుచే ఇరాను శత్రువుల వశంకాకుండా చేయుట ఇండియా కెంత మేలో తెలియగలదు.

రష్యా-జర్మనీ పెద్ద రాజ్యాలు తీవ్రంగా యుద్ధంచేస్తూ ఆ యుద్ధంలోనే అలసిపోతాయి, తమకేమి ప్రమాదముండదని

“స్క్యాకి ఫిషల్ హాకు” ఆర్. ఏ. ఎఫ్. ఆఫీసరు అయినాడు.



ఇతడు బర్మా దేశీయుడు, బ్రిటిషు విమానదళములో ఆఫీసరుగా చేర్చుకోబడ్డానికి ఇతడే మొదటి బర్మా దేశీయుడు. ఇతడు “బర్మా” ఫైటరు విమానదళ యింజనీరుగా నియమింపబడ్డాడు. ఇంగ్లీషులో ఇతడి పేరునకు “స్క్యాకి ఫిషల్‌హాకు” అని అర్థము. ఈయన బర్మా విమానదళ అధికారితో కలసి ఒక హరికేను విమానాన్ని పరీక్షించుచున్నాడు ; ఈ బర్మా విమానదళాధికారి స్వయముగా 27 జర్మను విమానాలను పడగొట్టినాడు.

మధ్యప్రాచ్యదేశములందు ప్రజలు భావించుచున్నారు. సిరియా, ఇరాకులందలి బ్రిటిషు చర్య వారికి ధైర్యం కలిగించి యుండును. కాని ఇరానులో ఇంగ్లాండు రష్యాలు యిట్లు ఆక్రమించుటచేత, దీనికి ప్రతిగా జర్మనీ టర్కీ ద్వారా వచ్చి పడుననిగూడా వారు భయపడుచుండురు. టర్కీని ఇంగ్లాండు రష్యాలు చుట్టివేస్తున్నాయి, మింగేస్తాయని జర్మనీ రేడియో ప్రచారం సాగిస్తున్నది కూడాను. అందుచే టర్కీని అక్షరాజ్యాలకూటంలో చేరమని కోరుచున్నారు. నల్లసముద్ర ద్వారమగు డార్డనల్సు జలసంధి టర్కీ వశమందుండుటచే, అక్షరాజ్యాల యుద్ధ నౌకలు రష్యాపైబడుటకు మార్గమిమ్మని ఒత్తిడిచేస్తున్నారు కూడాను. కాని టర్కీ లొంగే సూచనలేమిలేవు.

## అమెరికా యుద్ధంలో దిగుతుందా?

“గ్రీరు” యుదంతం.

అమెరికా యుద్ధ నౌక “గ్రీరు” అనునది టపాతో గూడ ఐస్లుండు దీవికి సెప్టెంబరు 4 వ తేదీన పోతూవుండెను. అట్లాంటికు సముద్రంలో యింకను అమెరికా వైపుననుండగనే జర్మను సబ్‌మెరైను ఒకటి దానిని టార్పెడోలతో కొట్టెను. అవి గురితప్పుటచే “గ్రీరు” జవాబుగ ఫిరంగులు ప్రేల్చి సబ్‌మెరైన్ను ముంచివేయుటకు పీపాల వంటి “డెప్తుఛార్జి” ఫిరంగి గుండ్లను దానిపై పడవైచెను. అది దెబ్బతిన్నదనే యెంచబడెను. “గ్రీరు” నౌకపై 122 మనుష్యులు, 1,990 టన్నుల బరువు సామానుగలదు. అమెరికా పతాకం యెగురుచున్నది. పట్టపగలు స్పష్టంగా అమెరికా నౌకయని తెలుస్తూవుండగనే జర్మనీ సబ్‌మెరైను అన్యాయంగా దాన్ని కొట్టిందని అధ్యక్షుడు రూజువెల్టుగారన్నారు.

ముందుగా “గ్రీరే” తమ సబ్‌మెరైనుపై గురిచూచి “డెప్తుఛార్జి” వేసిందనియు, అందుచే ఆత్మరక్షణకై టార్పెడోలు ప్రేల్చవలసివచ్చిందనీ, అవి గురి తప్పినవని జర్మను వుద్యోగులు చెపుతున్నారు. అంతేకాక అధ్యక్షుడు రూజువెల్టుగారు తాటస్థ్య నియమములకు విరుద్ధంగా జర్మను సబ్‌మెరైనులు కనబడితే కొట్టుమని తమ యుద్ధ నౌకలకు వుత్తరువు చేసేరనికూడా అన్నారు. ఇదంతా అబద్ధమని అమెరికా నౌకాదళాధికారులు ప్రకటించిరి; ముందు జర్మను జలాంతర్గామే కొట్టిందన్నారు. వెనక జూలై 10 వ తేదీన “రాబినుమూరు” అను అమెరికా నౌకను జర్మను సబ్‌మెరైను చేముంచబడినందున, అమెరికాలో గొప్ప సంచలనం జర్మనీపై ద్వేషంకలిగింది,

సబ్ మెరైను కనబడితే దాని అంతుచూస్తామని అధ్యక్షుడు రూజువెల్టుగారు విలేఖరులతో అన్నారు. ఈ యుదంతంవలన అమెరికా యుద్ధంలో దిగగలదని బ్రిటిషు పత్రికలు వ్రాస్తున్నాయి. ఇదో పెద్ద తప్పున్నూ గమనింపదగ్గ నేరంగాను యెంచి, యిపుడు అమెరికా ఇంగ్లాండు సహాయంకొరకుగాక తనకొరకే సముద్రమార్గాల రక్షణకొరకే యుద్ధంలో ప్రత్యక్షంగా దిగాలని అమెరికా పత్రికలు వ్రాస్తున్నాయి.

ఇది జరిగినవెంటనే, "స్టీలుసీఫేరెరు" అను పేరోక అమెరికను। అద్దె నౌక ఉత్తరసముద్రంలో ఆదివారంనాడు 7 వ తేదిన పోవుచుండగ విమానంలోనుండి బాంబుపడి మునిగిపోయింది. జర్మను బాంబరు విమానాలు సూయజుకు దక్షిణంగా చాలదూరంవరకు డొంకకను దీవులనుండి రాత్రులందు వచ్చి దాడి చేస్తున్నాయి. ఈ యుదంతాన్ని అనుసరించి అంతర్జాతీయ సంబంధాలు యెట్లు మారుతాయో చూడాలి. నాజీల చర్యలవలన అమెరికా నౌకలకును నావికులకును కలిగిన నష్టములకు పరిహారమును అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు గురువారం ఉపన్యాసంలో కోరుననియు, సముద్రమార్గాల భద్రతకు యేమాత్రం లోటువచ్చిన సహించమని స్పష్టంగా తెలియపరచరనియు తెలియుచున్నది.

## రష్యా విజయములు—బ్రిటిషు అమెరికాల సహాయము

రష్యా యుద్ధమున, ఉత్తరమున ఫిన్నిషు సైన్యములు లడోగా-ఒనీగా సరస్సుల మధ్యనున్న 'స్విర్' నదివరకు ఆక్రమించెనని ఫిన్నిషు అధికారులు తెలుపుచుండిరి. లెనిన్‌గ్రాడునకు తూర్పుగా 25 మైళ్లు దూరమున లడోగా సరస్సు తీరమునగల షూసెల్బర్గు అను పట్టణమును తాము స్వాధీనపరచుకొంటిమనియు, దానితో లెనిన్‌గ్రాడు నగరము అన్ని వైపులనుండియు జర్మనులచే చుట్టుముట్టబడెననియు జర్మనులు ప్రకటించిరి. ఇది సర్వాబద్ధమనియు, పడమట, దక్షిణములుగా జర్మనులు సమీపించినను, తూర్పువైపున జర్మను సైన్యము లెచ్చటను లేవనియు రష్యనులు ప్రకటించిరి.

మధ్యరంగమున (స్మొలెన్స్కు వద్ద) రష్యను సైన్యము జర్మనులపై భయంకరమగు తిరుగుదాడుల సాగించి, యెల్నియా, స్మొలెన్స్కు పట్టణములనుగూడ తిరిగి ఆక్రమించెనని చాలమంది తెలుపుచుండిరి. దక్షిణమున యుక్రేనియా యందు, నీపరునదిని దాటుటకు జర్మను లొనర్చిన ప్రయత్నములన్నియు విఫలమొనర్పబడెను. పది రోజులక్రింద జర్మనులచే చుట్టుముట్టబడిన ఒడెస్సా రేవు దుర్గమున రష్యను సైన్యములు శత్రుల నింకను జయప్రదముగనే ప్రతిఘటించుచున్నవి. మొత్తమున, ఈవారము జర్మనులు విప్రాంతమునను ఒక్క అడుగైనను ముందుకు పోగలుగలేదు. మధ్యరంగమున చాల మైళ్లు వెనుకకు కొట్టబడిరి. ఈరంగమున జర్మను లింకను వెనుకకు మరలిపోయెదరనిగూడ తలంచుచున్నారు.

కాని, యుద్ధమున పురోగమనముకంటె జర్మనులకు రష్యనులు కల్గించిన అపారమగు నష్టములు జర్మను సైనికయంత్రమును శిథిలపరచుచున్నది. మధ్యరంగమున ఈవారము 200,000 జర్మను సైనికులు హతులైరి. వేలకొలది టాంకులు, ఫిరంగులు, ఆయుధ సామగ్రి రష్యనుల వశమైనది. ఈ నష్టములను జర్మను సైన్యములు భరింపజాలక వెనుకకు పారిపోవుచున్నారు.

చర్చిలు ప్రధాని పార్లమెంటులో ప్రసంగించుచు అమెరికానుండియు, బ్రిటనునుండియు అపుడే, కావలసినంత ఆయుధసామగ్రి, విమానములు రష్యారంగముల చేరుచున్నదని ప్రకటించెను.

అమెరికా సంయుక్త రాష్ట్రములనుండి రష్యాకు పెట్రోలును తెచ్చుచున్న అమెరికను నౌకలు, వ్లాడి వాస్టా రేవు (రష్యా) చేరెను. జపానీయులు దీనిని ప్రతిఘటింపలేదు. ఆ నౌకలు వ్లాడి వాస్టా రేవును చేరిన విషయము మాత్రము, జపాను పత్రికలయందు ప్రకటింపబడలేదు.

## ఈ వారంలో యుద్ధ వార్తలు

### విమానదాడులు.

సెప్టంబరు 3 వ తేదీ రాత్రి, బ్రెస్టు రేవు (ఫ్రెంచితీరము) పై బ్రిటిషు విమానములు చాల బాంబులు వేసెను. 4 వ తేదీ మధ్యాహ్నము "ఆకాశ దుర్గాలు" అనే బ్రహ్మాండమగు బ్రిటిషు విమానాలు రాటర్డాం (హాలండు) నందలి జర్మను విమానాశ్రయములమీద, నౌకాశ్రయములమీద దాడి జరిపి వందలకొలది బాంబులు వర్షించెను. ఫ్రాన్సునందు జర్మనులాక్రమించియున్న ప్రాంతముపైగూడ చాల విమానములు దాడివెడలెను. అచట ఆకాశమున జరిగిన విమాన పోరాటములలో 11 శత్రు విమానములు ధ్వంసము చేయబడెను. మన విమానములలో 8 తిరిగిరాలేదు. ఆ రాత్రి బర్లిను (జర్మనీ రాజధాని) నగరముపైన రష్యను విమానములుగూడ దాడి జరిపెననియు వానిలో 2 విమానములు పడగొట్టబడెననియు జర్మనులు ప్రకటించిరి.

6 వ తేదీ మధ్యాహ్నము, బ్రిటిషు "ఆకాశదుర్గం" విమానమొకటి ఆస్లో (నార్వే రాజధాని) నగరముపైకి జని అచటు రేవునందున్న నౌకలపై చాల బాంబుల వర్షించెను. ఆరాత్రి జర్మనీలో కృత్రిమపు రబ్బరు తయారుచేసే యంత్రశాలలుగల హాల్సు పట్టణముపైన బ్రిటిషు విమానాలు వందలకొలది బాంబులు వర్షించి యంత్రాలయముల శిథిలమొనర్చెను. 7 వ తేదీ రాత్రి వందలకొలది బ్రిటిషు విమానములు, బర్లిను (జర్మను రాజధాని) నగరముపైకి, బ్రహ్మాండమగు దాడి జరిపెను. అనేకవేల కొత్తరకపు పెద్ద బాంబులను నగరమంతటను వర్షించెను. జర్మను నౌకా నిర్మాణశాలలకు నిలయమగు కీలు రేవుపైనగూడ కొంచెము తక్కువగ అంతటి భయంకరమగు దాడియే జరిగెను. ఇట్టిదాడి యింతవరకు యెన్నడు జరుగలేదు. ఫ్రెంచితీరపు బులోను మొదలగు రేవులపైన వేసిన బాంబులచే లేచిన మంటలు చాల గంటలవరకు అనేకమైళ్లు దూరమువరకు కనుపించుచుండెను.

కెలే రేవు (ఫ్రెంచితీరము) నుండి జర్మనులు పెద్ద బారు ఫిరంగుల నుపయోగించి బ్రిటిషుతీరమునందలి డోవరు రేవు పట్టణముపైకి 8 వ తేదిన ఫిరంగిగుండ్లను వర్షించిరి. పట్టణమున చాల భవనములు శిథిలమయ్యెను. ఆరోజు రాత్రి, జర్మను విమానములు ఒక్కొక్కటొక్కటిగామాత్రమే కోస్తా పట్టణములపైకి దాడి వచ్చెను. అవి అక్కడక్కడ బాంబులు వేసెను. కొలదిమంది ప్రజలకు దెబ్బలుతగిలెను. ప్రాణనష్టము చాల తక్కువ.

3 వ తేదీ బుధవారము రాత్రి బ్రిటనుమీదకు చాల తక్కువ విమానాలు మాత్రమే దాడి వచ్చినవి. ఈశాన్య భాగంలో కొలదిగ బాంబులు వేసినవి. ఆస్తికి స్వల్పముగ నష్టము కలిగినది. ప్రాణనష్టం మాత్రం జరుగలేదు. 4 వ తేది రాత్రి ఇంగ్లండు తూర్పు భాగంలో శత్రు విమానములు కొన్ని బాంబులు వేసెను. ప్రజలలో కొందరికి దెబ్బలు తగిలెను. 5 వ తేదీ ఉదయము స్కాట్లండు ఈశాన్య భాగంలో శత్రువులు కొన్ని ప్రదేశములపై బాంబులువేసిరి. 6 వ తేది రాత్రి శత్రు విమానములు బ్రిటను నైరుతి భాగంలో చాల బాంబులు వేసెను. వీనివలన కొంత ఆస్తికి నష్టముగల్గెను. 7 వ తేది రాత్రి నాలుగైదు శత్రు విమానములు బ్రిటను తూర్పు తీరపు పట్నములపై బాంబులు వర్షించి కొంత ఆస్తికి నష్టము గలిగించెను. స్వల్పముగ ప్రాణ నష్టముగూడ జరిగినది.

100 బ్రిటిషు విమానములు 8 వ తేదీ రాత్రి జర్మనీ యందలి ముఖ్యమగు పారిశ్రామిక పట్టణములలో నొకటియగు కాస్సెలు నగరముపై తమదాడిని కేంద్రీకరించి వేల

కొలది పెద్దబాంబుల వర్షించి అచటి ఫ్యాక్టరీలను శిథిలపరచెను. జర్మనీలోని "మన్‌స్టరు" మొదలగు ప్రదేశములను, ఫ్రెంచి కోస్తా రేవులపైనను గూడ అరాత్రి పెద్ద దాడులే జరుపబడెను.

గత వారము యిరోపా పశ్చిమ ప్రాంతములలోను మధ్య ప్రాచ్యదేశములలోను కలసి 38 అక్సిస్ విమానములు, 45 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను. జర్మనీపై దాడులనుండి 28 విమానములు తిరిగిరాలేదు. నౌకలపై దాడులలో 11 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను. 14 శత్రు విమానములు పడగొట్టబడెను.

### ఇటలీ, ఆఫ్రికా, మధ్యధరా.

8 వ తేదిన ఇటలీ రాజధానియగు రోము నగరముపై బ్రిటిషు విమానములు దాడి జరిపెను.

4 వ తేదిన శత్రులు టొబ్రూకు (ఉత్తరాఫ్రికా—లిబియా) దుర్గముపైన విమానముల నుపయోగించి దాడులు సల్పిరి. కాని నష్టంకలుగలేదు. దానికి ప్రతీకారముగ, బ్రిటిషు విమానములు శత్రు శిబిరములపై దాడులు సాగించి చాలనష్టము కల్గించెను. ఈజిప్టు—లిబియా సరిహద్దుల యందుగూడ అట్టి విమాన దాడులే జరిగెను. 8 వ తేదిన టొబ్రూకు ప్రాంతమున శత్రులు ఫిరంగులను అధికముగ నుపయోగించి, బ్రిటిషు శిబిరములకు తొందర కల్గింప ప్రయత్నించిరి. ఆరు మారులు శత్రు విమానములువచ్చి బాంబులు వేసెను. కాని బ్రిటిషు సైన్యము వానినన్నిటిని తిరుగగొట్టెను.

3 వ తేది రాత్రి సూయజు కాలువ ప్రాంతముపైనను, ఈజిప్టు రాజధానియగు కెయిరోపైనను శత్రు విమానములు బాంబులు వేసెను. కెయిరోలో ఒక మనిషి హతుడయ్యెను. 21 మందికి గాయములు తగిలెను. సూయజు కాలువకు కొంత నష్టముగలిగెను. సూయజు కాలువపైన మరునాడు గూడ చాలపెద్ద బాంబులు వర్షింపబడెను. ఇరువురు మరణించిరి ముగ్గురికి గాయములు తగిలెను.

4 వ తేది రాత్రి శత్రు విమానములు, అలలుగావచ్చి మాల్టాదీవిపై చాలసారులు బాడులు సల్పెను. ప్రజల ఆస్తికి మాత్రం స్వల్పముగ నష్టముగలిగెను. 6 శత్రు విమానములు పడగొట్టబడెను.

5 వ తేది రాత్రి బ్రిటిషు నౌకాదళ కేంద్రమగు అలెగ్జాండ్రియాపైనను, సూయజుపైనను గూడ శత్రు విమానములు బాంబులు వేసెను. ఈ దాడులలో ఆస్తికి నష్టము స్వల్పము. 5 గురు మరణించిరి.

### అమెరికా—అట్లాంటిక్.

ఒక వైపున అట్లాంటికు సముద్రమున, మరియొకవైపున పసిఫిక్ మహాసముద్రమునగూడ, ఒకే సమయమున యుద్ధము వచ్చుచో, ప్రతిఘటించుటకు తగిన నౌకాదళమును నిర్మించుకొను కార్యక్రమము అనుకొనిన దానికంటె శీఘ్రముగ జరుగుచున్నదని సంయుక్తరాష్ట్ర ప్రభుత్వస్థాయి సంఘాధ్యక్షుడగు అడ్మిరల్ లాండుగారు 4 వ తేదిన ప్రకటించిరి. గత జనవరి మాసమునుండి ఇంతవరకు, 213 నౌకలు సం. రా. రేవులలో నిర్మింపబడెను. 436 నౌకలు నిర్మాణమునందున్నవి.

అరువు-కవులు చట్టముక్రింద పోలిషు ప్రభుత్వమునకు సైనికులకు కావలసిన దుస్తులు ఆయుధములు సప్లయిచేయుటకు రూజ్వెల్టు అధ్యక్షుడు ఉత్తరువుచేసెను.

అట్లాంటికు సముద్రమున మిత్రమండలి నౌకానష్టము లిప్పటి రీతినే సాగుచుండునెడల సం.రా. ప్రభుత్వమువారు తాటస్థ్యశాసనమును మార్చుకొని యుద్ధదేశముల రేవులను ప్రవేశించుటకుగూడ తమ నౌకలకు స్వాతంత్ర్య మొసగవలసి యుండునని న్యూయార్కు టైమ్సు పత్రిక హెచ్చరించెను.

సం.రా. ములలో యుద్ధ విమాన నిర్మాణశాలలు ఆగస్టు మాసమున 1,854 విమానముల నిర్మించి యొసగెను.

అమెరికానుండి ఐస్లాండునకు 'టపా' తీసుకొని వెళ్లుచున్న "గ్రీర్" అను అమెరికను డిస్ట్రాయెరు (చిన్న యుద్ధనౌక) 4 వ తేదిన అట్లాంటికు సముద్రమున ప్రయాణ మొనర్చుచుండగా, జర్మను జలాంతర్గామియొకటి "టార్పెడో"ను గురిచేసికొట్టెను. కాని అది గురితప్పెను. "గ్రీర్" నౌకలోనివారు జలాంతర్గామని ముంచుటకు "డెప్తుచార్జి"ని వదలిరి.

5 వ తేదిన జర్మను లీవిషయమై ప్రకటనగావించుచు, ముందుగ గ్రీర్ నౌకయే జర్మను జలాంతర్గామిపై గుండ్లను బారుచేసెనని ఆరోపించి ఆత్మసంరక్షణార్థము జలాంతర్గామి తిరిగి "టార్పెడో"ను బారుచేసెనని ప్రకటించిరి. అమెరికా అధికారులు ఈ యారోపణలు అసత్యములని ఖండించిరి.

"స్టీల్ సీఫేరరు" అను పేరుగల అమెరికను సరకుల నౌక ఎర్రసముద్రమున 7 వ తేదిన ప్రయాణమొనర్చుచుండగా సూయజుకు 200 మైళ్లదూర్పున ఒక విమానము ఆ నౌకనెదిర్చి బాంబులువేసి ముంచివేసెను. ఆ విమానము యెవరిదో తెలియలేదు "సీఫేరరు" అమెరికానుండి మధ్యప్రాచ్యము నందలి బ్రిటిషు సైన్యములకు ఆయుధ సామగ్రినితెచ్చుచున్నది.

ఐస్లాండునకు 300 మైళ్ల దూరముగ, "సెస్సా" అను మరియొక అమెరికను నౌక శత్రులచే ముంచివేయబడెనని సంయుక్తరాష్ట్ర దేశీయాంగశాఖవారు ప్రకటించిరి.

### విషీ.

ఫ్రాన్సులో జర్మనుల ఆక్రమణలోనున్న ప్రాంతపు ప్రజల నుండి, రష్యాపై పోరాడుటకు జనుచున్నయువకుల తండ్రులలో నెవరైన జర్మనీయందు యుద్ధఖైదీలుగనున్నచో, ఆఖైదీలువిడుదల చేయబడుదురని జర్మను అధికారులు ప్రకటించిరి. పారిసునందలి "స్పెషలు ట్రిబ్యునలు" 9 మంది కమ్యూనిస్టులకు 7-12 వ సంవత్సరముల కఠినశిక్ష విధించెను.

జర్మను అధికారుల కోర్కెలపై, ఫ్రాన్సులోనున్న రష్యనులనందరను విషీ అధికారులు పట్టుకొని కాపలాయందుంచుటకు ఉత్తరువుల గావించిరి.

వర్సెయిల్సు పట్టణమున, తుపాకిచే కాల్చబడిన లావెలు గారును, డీటుగారును గూడ, వైద్యశాలలో ఆరోగ్యాభివృద్ధిని గాంచుచున్నారు. వారికి ప్రాణాపాయ స్థితిదాటినదని వైద్యోద్యోగులు 6 వ తేదిన ప్రకటించిరి.

ఫ్రాన్సులో కొంతభాగము నాక్రమించియున్న జర్మను సైన్యముల ఖర్చుల తగ్గించువిషయమున విషీ జర్మను ప్రభుత్వములకు సంప్రదింపులు విఫలమయ్యెను. జర్మని నిరాకరించెను.

### టర్కీ, ఇరాక్, ఇరాన్.

ఇరాన్‌లోనున్న జర్మనులువచ్చి కోరినయెడల, తమ రాయబారవర్గ భవనములలో ఆశ్రయ మొసగవలదని, టెహరాన్ (ఇరాన్) నగరమునందలి తమ రాయబారికి టర్కీ ప్రభుత్వమువారు ఉత్తరువులనంపిరి. పారిపోయివచ్చుచున్న 1,500 ఇరాన్ అశ్విక సైనికులు టర్కీ సరిహద్దుల ప్రవేశింపగా, అచటి అధికారులు వారిని నిరాయుధులగావించి కాపలాయందుంచిరి.

టర్కీకిని-జర్మనీకిని కొత్త వర్తకపు ఒడంబడికను కుదుర్చుకొనుటకుగాను డాక్టరు క్లాడియస్‌గారి నాయకత్వమున ఒక పెద్దజర్మను రాయబారవర్గము 8 వ తేదిన టర్కీయందుదిగెను.

ఆంగ్ల-రష్యను సైన్యములు ఇరాన్ ప్రవేశించుసరికా దేశమునందున్న జర్మనులలో నొక్కరుగూడ దేశమునుండి తప్పించుకొని పోగలుగలేదని తెలియుచున్నది.

ఇరాన్‌నందలి నూనెగనుల ప్రాంతములన్నియు బ్రిటిషు సైన్యములచే ఆక్రమింపబడెను.

### దూరప్రాచ్యము.

పసిఫిక్ మహాసముద్ర ప్రాంతములకు సంగ్రామము వ్యాపింపకుండ జేయుటకుగాను, వాషింగ్టనునందు (అమెరికా సంయుక్త రాష్ట్రములు) జపాను రాయబారి రూజ్వెల్టు అధ్యక్షునితో జరుపుచున్న సంప్రదింపులు ఇంకను సాగుచునేయున్నవి. జపానును సంతృప్తిపరచుట కెట్టి సౌకర్యముల

వొసగరాదని, ఆంగ్లపత్రికలు, సంయుక్త రాష్ట్ర పత్రికలును గూడ హెచ్చరించినవి.

జపానుకు పెట్రోలు ఎగుమతిచేయుటకు, అమెరికను అధికారులు ఆగస్టు 1 వ తేదినుండియు యెట్టి లైసెన్సులను ఒసగలేదు.

ప్రజాభిప్రాయమును దెలియుట కేర్పడిన జరిగిన "గాల్లప్ పోలు" నందు, యుద్ధమున దిగినను సరే జపానును నిరోధించుటకు అమెరికనులలో అత్యధికసంఖ్యాకులు అనుకూలురుగ నుండిరని వెల్లడియైనది.

జపానుకు ఐరోపాదేశములతో నెట్టి రాకపోకలు లేకుండ ఇంచుమించు పూర్తిగ దిగ్బంధనము జరుగుచున్నదనియు, అందుచే జపాను స్వదేశమునందును, పొరుగు ప్రాంతములందును లభించు సరకులతో స్వయంసమృద్ధమగుటకు తీవ్రముగ కృషిసల్పవలెననియు వాణిజ్య మంత్రియగు వైస్ అడ్మిరల్ సకోంజిగారు ప్రకటించిరి.

ε యుద్ధపరికరముల తయారుచేయుటకు ఉపయోగించు ముడిపదార్థములను వేనిని జపానుకు ఎగుమతి చేయరాదని బ్రిటిషు ప్రభుత్వము నిషేధించెను.

చైనాప్రభుత్వ విమానదళమున చేరుటకుగాను 200 మంది అమెరికనులు ఈవారము డచ్చి యిండియా దీవులమీదుగా చైనాకు వచ్చిరి.

వాషింగ్టనునందు జపాను రాయబారి సాగించుచున్న సంప్రదింపుల ఫలితముగ, చైనాకు సహాయమొనర్చు విధానమున యెట్టిమార్పును గలుగదని సంయుక్తరాష్ట్ర దేశీయాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు చైనా రాయబారికి వాగ్దాన మొసగెను.

దక్షిణ చైనాలో, ఫ్యూకీన్ రాష్ట్రమున ప్రధానమగు రేవులలో నొకటగు "ఫూచౌ" నగరమును జపాను సైన్యములు 3 వ తేదిన ఖాళీచేసెను. చైనా సైన్యములు ఆరోజుననే ఆ రేవును ఆక్రమించెను.

పిమ్మట ఫ్యూకీన్ రాష్ట్రమునందలి సముద్రతీర పట్టణముల నన్నిటినిగూడ చైనా సైన్యము లాక్రమించెను. అచటనుండి తీరమునకు సమీపమునగల దీవులనుగూడ స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించుచున్నారు.

జపాను అధికారులు చైనాలో ఇంకను చాల పట్టణములను రేవులను ఖాళీచేసి తమ సైన్యముల నుపసంహరించుకొనెదరనియు, చైనా సైన్యములు త్వరలో ప్రారంభింపనున్న బ్రహ్మాండమగు తిరుగుబాడిని ప్రతిఘటించుటకు, రంగమును సాధ్యమగునంతవరకు తగ్గించుకొనుట కిట్లుపసంహరించుకొనుచుండిరనియు తలంచుచున్నారు.

బ్రిటిషు సామ్రాజ్య ప్రాంతములలోని జపాను పౌరులను స్వదేశమునకు జేర్చుటకు, వేర్వేరు ప్రాంతములకు త్వరలోనే మూడు నౌకలు పంపుటకు జపాను అధికారులు ఏర్పాటులు చేయుచున్నారు.

జపాను-అమెరికాలకు జరుగుచున్న సంభాషణల ఫలితముగ ఇంతలో వివిధమగు ఒడంబడికగాని కుదురునని తాను చెప్పజాలనని కార్డెలు హల్లుగారు 10 వ తేదిన వెల్లడించిరి.

## నౌకా నష్టములు.

4 వ తేదిన మధ్యధరా సముద్రప్రాంతమున 5 శత్రుల సప్లై నౌకలు 4 డిస్ట్రాయరు నౌకల రక్షణతో ప్రయాణమొనర్చుచుండగా బ్రిటిషు విమానము లెదిర్చి వానిలో 3 నౌకలను ముంచివేసెను. 3 వ తేది రాత్రి ట్రిపోలీ రేవువద్ద (ఉత్తర ఆఫ్రికా) బ్రిటిషు విమానములు ఒక ఇటాలియను డిస్ట్రాయరు నౌకను ముంచివేసెను. సైనికుల తీసుకొని వెళ్లుచున్న "ఎస్పెరియా" అను ఇటాలియను నౌకను (11,398 టన్నులు), ట్రిపోలీ రేవువద్ద బ్రిటిషు జలాంతర్గామి 5 వ తేదిన ముంచివేసెను. ఆరోజుననే, మధ్యధరా సముద్రమున 4,000 టన్నుల మరియొక ఇటాలియను నౌక గూడ ముంచివేయబడెను. 6 వ తేదిన ఒక బ్రిటిషు డిస్ట్రాయరు రెండు జర్మను జలాంతర్గాములను ముంచివేసెను. 8 వ తేదిన "ఒస్టెండు" రేవువద్ద ఒక జర్మను నౌకాదళాధికారి యుద్ధనౌక బ్రిటిషు విమానములచే ముంచివేయబడెను.

పి. 33 రు బ్రిటిషు జలాంతర్గామి తిరిగి రాకపోవుటచే మునిగిపోయియుండవలెనని 6 వ తేదిన బ్రిటిషు అధికారులు ప్రకటించిరి.

బ్రిటిషు నౌకా దళాధికారుల లెక్కల ప్రకారము సంగ్రామారంభమునుండి ఇంతవరకును, శత్రుదాడులకు గురియైన దేశములనుండి 60 లక్షల టన్నుల నౌకలు ఆక్సిసు రాజ్యములకు లభించెను. 70 లక్షల టన్నుల నౌకలు బ్రిటనుకు వచ్చిచేరెను.

మర్మానిస్కు ప్రాంతమున బ్రిటిషు యుద్ధనౌకలు, ఒక జర్మను డిస్ట్రాయరును, ట్రాలరును, మరియొక నౌకను, బెర్మ్సే (14,009 టన్నులు) అను యుద్ధనౌకను 9 వ తేదిన ముంచివేసెను. 8 వ తేదిన ఇంగ్లీషుఛానలులో 4,009 టన్నులు, 3500 టన్నులు పరిమాణముగల రెండు జర్మను సప్లయి నౌకలను ఒక "ఈ" బోటునుగూడ ముంచివేసెను. మధ్యధరాసముద్రమున ఒక ఇటాలియను నూనె నౌకను, రెండు చిన్న నౌకలును ముంచివేయబడెను.

జూలై, ఆగస్టు నెలలలో మిత్రమండలి నౌకా నష్టములు, అక్షరాజ్యముల నౌకా నష్టములలో మూడవ వంతుకంటె ఎక్కువకాదని బ్రిటిషు అధికారులు ప్రకటించిరి.

జర్మనులు, నౌకల ఇంజనుల శబ్దమునుబట్టివచ్చి తగుల్కొని ప్రేలు మందు గనులను వెదజల్లుచున్నారనియు, వానిని పట్టి నిరపాయకరముగ చేయు సాధనములను బ్రిటిషువారిదివరకే కనుగొని ఉపయోగించుచున్నారనియు చర్చిలు ప్రధాని ప్రకటించెను.

బ్రిటిషు నౌకాదళ సైనికులు 7 వ తేదిన ఆకస్మికముగ, నార్వేకి 400 మైళ్లు ఉత్తరముగనున్న స్పిట్జుబర్గెన్ దీవుల (నార్వేవారివి) పైకిజని ఆక్రమించిరి. స్పిట్జుబర్గెన్ దీవులలో విస్తారమగు బొగ్గు గనులు కలవు.

## ఆక్రమిత ప్రాంతములు.

సర్వియాలో కమ్యూనిస్టులు ఒకజర్మను సైనికుని చంపిరను కారణముచే ప్రతీకారముగ అచటి జర్మను సైనికాధికారులు అరెస్టునందున్న 50 మంది సర్వియను కమ్యూనిస్టులను తుపాకితో కాల్చి చంపివేసిరి.

ఆక్రమిత ప్రాంతములలోని ప్రజలకు ఆహారపదార్థములొసగి పోషింపవలసిన బాధ్యత తమదిగాదని జర్మను అధికారులు ప్రకటించిరి.

తమ పుత్తరువుల శిరసావహింప నందుకుగాను, హాలండులోని ఆర్చి బిషపునకు జర్మను అధికారులు 500 గిల్డరుల జరిమానాను విధించిరి.

పారిస్ నగరమున, ఒక జర్మను నౌకాదళాధికారికి కుదుర్చబడిన బసలో బాంబులు కనుపించెను. వీధులందున్న ఒక జర్మను సైనికునిపైన ప్రజలలో కొందరు తుపాకులు ప్రేల్చిరి.

## తటస్థ దేశములు.

జర్మను అధికారులు కోరుటచే, స్విట్జర్లండు ప్రభుత్వము, ఫ్రాన్సునందు జర్మను ఆక్రమణయందున్న ప్రాంతములలోను, నార్వేలోనుగల తమ ప్రతినిధుల కార్యాలయములను (కాన్సలులను) రద్దు చేసుకొనెను.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.